కాళి:—వత్స ! కాళిదాస నీప్రార్థనంబు నంగీకరించితిని. భవదభీష్టార్థంబు నను కూర్పనప్పు డప్పుడు నీకుం గన్పడుచుందును. భక్తజనాపేక్షితప్రదానంబుకన్న నాకుం బ్రియంబు లేదు. సుఖంబున నుండుము.

(అని యంతర్హిత యగునట్లు నిష్క్రాంతయయ్యె.)

మదనసేన:—(కరమునంతసించుచు)

ప్రాణనాథ ! ఈదేవికి నీయందుఁ గలకరుణాతిరేకంబు కడు సంస్తవనీయంబు. ఇట్టి నిన్నుం బతిగాఁ బడసిననాయదృష్టంబె పొగడికొనందగియున్నది.

చ. అభినవమన్మథుం డనుచు నంగన లెల్లను మెచ్చురూపముక్
విభవసముజ్జ్వలం బయినవిశ్రుతియుం దగునాభిజాత్యముక్
సుభగతమీఋలవై దుషియు శుద్ధయశోవిభవంబు నింద్రస
న్నిభ మగుసంపద ల్వెలయునిన్ను నలంతుల కొంచె పొందఁగన్.

ఏను నాతొలిపుట్టువునం జేసినపుణ్యమయం బెట్టిదియో ! ఇట్టి సుకవికులావతంసంబుం జేపట్టఁ గలిగితిని. మఱియు నీవు సరస్వతీనవావతారుండ వనుటకు సందియంబు లేదు. కానిచో మంత్రోపదేశమాత్రంబునన దేవి సాక్షాత్కరించి వరంబు లొసంగునే ! అదియునుంగాక యిట్టిరసాస్వదం బగుసుకుమారార్థపదబంధురం బయినవచనరచనాచాతురి మనుష్యమాత్రుల కుండు నే !

చ. అరుణకరప్రసారవికచాంబుజషండనికామనిర్గళ
ద్వరమకరందబిందుఝరవై ఖరిచారుపదావళీమనో
హర మయి యొప్పునీకవిత నాస వినంగ సుధాబ్ధివీచికల్
వరుసగఁ బైఁబయిం బరవి వచ్చువిధంబునఁ దోఁచె నాత్మకున్.

ప్రాణనాథ ! చిరకాలసంప్రార్థితం బగుచున్నమన్మనోరథంబు నాయర్చించుచుండిన కులదేవతయనుగ్రహంబున నిప్పుడు ఫలియించె.

కాళిదాసుండు:—(మహాహర్షంబుతో)

ఓచంచలలోచనాతిలకమా ! వినుము.

చ. సురగరుడోరగప్రముఖశోభనగాత్రలకందరానియా
నిరుపమరూపసంపదల నివ్వటిలంగలనిన్ను మన్ననక్
నరభువనాంబుజాలయను నర్మిలిఁ బెండిలియైతి నింక న
చ్చెరు వగుజన్మభవ్యఫలసిద్ధి లభించెను నాకు నెచ్చెలీ.

(నేపథ్యంబున వైతాళికుండు)

చ. చెలువపుదీవి యామదనసేనను బెండిలివై మహోన్నతిన్
వెలుఁగుచుఁ గాళికావరముచేత మహాకవి వైతి వింక నీ
కులము పవిత్రమయ్యె సతికోరికియు న్ఫలియించె నిప్పు డీ
జలజసఖుండు దోఁచుతఱి చయ్యనఁ డగ్గఱ మేలుకోఁ గదే!

(వెండియు నేపథ్యంబున యొండు వైతాళికుండు)

చ. అమలిన మైననీయశము దంతటఁ బర్వఁగఁ జూచి వెల్లనై
యనుకలము న్గ్రసించు చిపు డంబుజవైరియుఁ గ్రుంకుచున్నవాఁ
డమరవధూవతంససుషమాపహరన్నతగాత్రఁ గూడుసం
భ్రమ మిపు డొప్పదయ్య! ఖరభానునిఁ గొల్వఁగ మేలుకోగదే!

కాళిదాసుండు:—ఓ ప్రాణేశ్వరీ! దేవీసాక్షాత్కారాదిశుభపరంపరలఁ గాలంబు గడచుట యెఱుఁగమైతిమి. ఇప్పుడు వేకువ యయ్యె! నీను శాపోపహతుండనై యుండు నప్పుడు కర్మానుష్ఠానంబు సేయక మానుకొన్నందుకుఁ బ్రాయశ్చిత్తంబు చేసికొని విశుద్ధిం బొరయవలసియున్నది. ఈనగరోపకంఠంబునం గలపుణ్యనదికిం జని యుషఃస్నానంబు సల్పి ప్రాచితంబుచేసికొని సూర్యోపస్థానాదులు దీర్చి వైళంబ వచ్చెద. మద్విరహంబున నీవు ఖిన్నతం జెందకుము.

మదనసేన:—(కాళిదాసునిం గౌఁగిలించుకొని)

చ. నిను నెడబాసి యొక్కత్రుటి నీరజసాయకమార్గణాళికిన్
మనమున నోర్వఁజాల నిఁక మానవలోకసుధామయూఖ ని
న్గనుఁగొనకుంటినేనిఁ ద్రుటికాలము గల్పశతంబు గా నగున్
ఘనశుభకీర్తి రమ్ము వెస కాల్యసుకృత్యము దీర్చి యానతోన్.

(మఱియును నిప్పుడు)

చ. నిను నెడఁబాయఁ బోవఁ గడు నిర్భర మైనవియోగవేదనన్
మనము మహాంధకారమున మగ్నతఁ జెందినరీతిఁ గాంచ మ
త్తను విడఁ గ్రాఁగ సాఁగె నొకకష్టము దుర్భర మైన దిప్పుడే
మునుకొని కల్గఁ బోవు నని మున్మను దోఁచుచునున్న దాత్మకున్

అదియునుం గాక మన్మానసం బనిష్టాశంకి యై యుత్తలంపడియెడిని. కాన నీ వొంటి నేఁగకుము. ఈభవనంబునకుం గావలియుండురక్షకభటవర్గంబును వెనువెంటఁ దోడ్కొని పొమ్ము. వేగ రమ్ము. నాయందుం గరుణయుంచి యుద్బుద్ధముగ్ధసరసిజశోభామనోహరం బగునీనగుమొగంబు వైళంబ వెండియుం గానిపింపుము.

కాళిదాసుడు:—ప్రాణవల్లభా! నా కెవ్వరును దోడు రావలయు నన్నది లేదు. అయినను నీమనస్సమాధానంబుకొఱకు వారలం దోడ్కొని పోయెదను. కాన మద్గతం బగుచింతచే నితాంతసమాకులస్వాంతవై యుండకుము. ఓభీరు! నీవొంటి నుండఁగలవే!

మదనసేన:—ప్రాణనాథ! ఒంటి యన నేల! వేకువ యయ్యె. ఇప్పుడ నాప్రియ సఖులు గుణమాలినీధనమాలినులు రారా! అందుకుం జింతింపవలదు.

కాళిదాసుఁడు:—ప్రాణవల్లభా! అట్లయిన సరే. ఏఁ బోయివచ్చెద.

(అని నిష్క్రాంతుం డయ్యె.)

మదనసేన:— (కొన్నియడుగులు వెనువెంటం జని, పైవలనికి దృష్టులు నిగుడించి)

ఆ! ఏమి యిది! ఇప్పుడు మూఁడవయామంబు ప్రవృత్తం బగుచున్న దని తార కలం గాంచినం దెలిసె. వైతాళికులు వేకువ యయ్యె నని పల్కిరి. నా ప్రాణనాథుని నన్ను నెడబాప నెవ్వఁడేని క్రూరుం డిట్టినికృతిం గావించెనొకో!

(శంకాతంకంబులతో)

వేకువ యయ్యెనేని దీపములకాంతి తగ్గదా! అట్లు గానంబడదే. దూరాలోచన సేయకయ పతిం బంపితిని. మానసంబు కర మలయుచున్నది. ఏమి సేయుదు! మాన సంబునం దేదియేని యొకయప్రియంబు గల్గంబోయెడునని తోఁచెడిని.

(ఎదుటికి దృష్టులు నిగుడించి, భయసంభ్రమంబులతో)

నావిద్యాగురు వసమయంబున గౌతముఁడు మఱియొక్కరునితో నిచ్చోటికిం జనుదెంచుచున్నవాఁడు. కట్టా! ఇతఁడు నాపయిఁ బ్రేమం బూని తొలుత నక్ర మంబు సేయం బూనినవాఁడు. ఇప్పుడు నేదేని యహితంబుసేయుటకే చనుదెంచు చున్నాఁడని తోఁచెడిని. కాదేని యిప్పు డిచ్చోటి కేల సనుదెంచు. నే నిచ్చోట నుండుట యుచితంబుగాదు. దవ్వులకుం జనియెద. భవనరక్షకభటవర్గంబును లేదు. ఆర్యపుత్రునితోఁ జనియె. అహా! యొకనిమిషంబులోనన దురతిపాత్యం బగు నెట్టి యిడుమ సంభవించినయది!

(అని వెనుకంజ యిడుచుఁ ద్వరితతరంబుగఁ జనుచున్నది.)

(యవనభటసహితుండై గౌతముఁడు ప్రవేశించె.)

గౌతముఁడు:—ఓమదనసేనా! పోకుము పోకుము. ఇంకఁ దప్పించుకొన నీకుం దరంబుఁగాదు. ఇది నిశీథసమయంబు. నీ వీకేళీగృహంబునం బ్రవేశించుటకు ముంద నిగూఢగతి నే నీకేళీమందిరంబు జొచ్చియుండి యిందు జరిగినవృత్తాంతంబు సూచుచు నీ నాయకుని నిన్ను నెడబాపి నిన్నపహరింపం గడంగి వైతాళికులవలె నుడివి నికృతి మెయి నాతని వెలువఱిచితిని. ఈ వీరభటుని నాకుం గావలి దెచ్చుకొని మందిరబహి

స్థలంబున నిలిపి నీపతి వెలికిం జనునప్పు డంతరంబుఁ గల్పించుకొని వచ్చిన యీతనితోఁ జేరుకొని నిన్నపహరింప నిచటి కరుదెంచినాఁడ. నీ విఁక ఋజుభావంబునం గదలి సద్దు సేయక నాగొనితెచ్చియుండునరదంబు నెక్కి నాయింటికిం జనుదెంచితివేని మేలగును. అట్లుసేయవేని నిన్నీయవనుండు కరకలితఖడ్గధారాఖండితగాత్రిం గావింపంబోయెడిని.

మదనసేన:—(భయశోకంబులతో, ఆత్మగతమున)

కట్టా! నామానసంబునఁ దోఁచినయర్థంబు సత్యంబయ్యె. అనతిపాత్యంబయిన యిడుమ వాదమినయది. ఏమి సేయంగలదానను. ఇందాలస్యం బొనర్చితినేని యితఁడు నన్నుం బట్టుకొనుట నిక్కువంబు. అట్లు గాక యితనివచనం బనుష్ఠింపం బూనినదానం బోలె నటించితినేని త్రోవ నెవ్వరేనియు నడ్డపడరా!

(అని చింతించుచుండె.)

గౌతముఁడు:—ఓసి రాజపుత్రి! ఇంకం జింతం గూరుటవలన నుపయోగంబు లేదు. వెడలుము వెడలుము.

మదనసేన:—(శోకంబుతో)

ఓ యనాథరక్షకా! ఆశ్రితవాత్సల్యజలధీ! గజేంద్రవరదా! ద్రౌపదీమానపాల! రుక్మిణీనాథ! నీకంటె నాకు దిక్కెవ్వరున్నారు! ఈ దీనను గావ నీవు నాప్రక్కన యున్నాఁడ వని నమ్మియున్నదానను.

(అని పలుకుచు వెడలుచున్నది.)

గౌతముఁడు:—ఓ సుందరీతిలకమా! నాయభీష్టంబు నెఱవేర్చెద నంటివేని నిన్ను నేను రక్షించెదను. ఇంతటిపనికి గజేంద్రరక్షకుని దడవ నేల! ఓసి కామినీమణీ! నీ యిష్టంబుం దెల్పెదవేని యింద నీతోఁ గేళివిహారం బనుభవించి నిన్ను వదలి చనియెదను.

మదనసేన:—(భయపడుచు! ఆత్మగతమున)

కట్టా! నా కియ్యెడ నుండక చనుటయె యిప్పటికి మేలు!

(అని త్వరితగతిం జనుచున్నది.)

గౌతముఁడు:—ఓ కాంతామణీ! నేను తుద కొకమాఱి నీతో సుఖింపం గోరితిని. నీ విపుడు నాకు సంతతము ప్రియంబు సేయం గడంగెదవు. నాకు నీవంటియభీష్టప్రదురాలు గలదా! మంచిది పొమ్ము. రథం బారోహింపుము.

మదనసేన:—(అడుగులుతడఁబడ రథముకడకుఁ ద్వరితగతిం బోవుచు నిష్క్రాంతయయ్యె.)

గౌతముఁడు:—(వెనువెంటం జనుచు)

ఓరీ యవన! నా వచనంబున నీ సుందరి రథారూఢ యయ్యె. వీను నిజ రథం బారోహించెదను. నీ వలివేగంబున నరదం బెక్కి రథ్యంబుల నడుపుము.

యవనభటుఁడు:—ఓ బాలసమ్మా! అట్ల యొనర్చెద.

గౌతముఁడు:—(సంతసంబుతో)

ఉ. అంబుజపాణి నాకును స్వహస్తధనం బయి పొల్చె నిప్పుడే
బింబఫలాధరిం గొనుచు భీతిల కెయ్యెడ కైనఁ బోయి యా
యంబుదవేణిఁ గూడుచు సుఖాంబుధిఁ దేలుదు మధ్యమార్గమం
దుం బరిపంథి యడ్డమయి లోఁచకయుండిన మేలె యయ్యెడిన్.

(అని యిరువురతో నిష్క్రాంతుం డయ్యె.)

కాళిదాసచరిత ప్రకరణంబునందు చతుర్థాంకము సంపూర్ణము.



శ్రీ ర స్తు

# కాళిదాసచరిత్ర ప్రకరణము

## పంచమాంకము

---

(వీర్యగుప్తుండు ప్రవేశించుచున్నాఁడు.)

వీర్యగుప్తుఁడు:—ఔర ! మదనసేనకుం గలసౌందర్యంబు లోకంబున నుండు పువ్వుంబోఁడుల కెవ్వారలకేని యుండ దని యనుకొనియెదను.

ఉ. ఆవనజాక్షి ముద్దుమొగ మక్షిపథంబునఁ దోఁచుటాదిగా
భావిత మైనశీతకరపార్వణబింబము నింపు గాదు నా
భావము దానిచంచలతరాంచలలోచనము ల్గనంగ ని
చ్చావిధిఁ గాంచ దుత్పలనిసర్గవిలాసము లాత్మ మెచ్చఁగన్.

మఱియును,

ఉ. దానిబొమ ల్గనుంగొనిన దర్పకచాప మ దెందుకొను పో
దానికురు ల్పయోదములతండముల న్నిరసింపఁ జాలు న
ద్దానియొడల్ కఠోరశిఖితప్తసువర్ణమనోజ్ఞరేఖయే
దానికి నీడుగారు పెరతామరసాయతనేత్ర లిద్ధరన్.

అదియునుంగాక,

చ. రతి సౌందర్యవిలాససంపదల నారాజీవపత్త్రాక్షి భా
రతి విద్యానిచయంబులందు సుషమారంభంబున న్జూడ శ్రీ
సతి యైశ్వర్యకలావిశేషమున నాచంద్రాస్య తా నాశచీ
సతి యా దానిని జూడకున్న నిఁక నాజన్మం బధన్యం బగున్.

ఇసీ! ఏమిది! ఏను దానిలో విద్యావివాదంబున నోడినాఁడను. మఱియు నయ్యిందువదన పెరవానిం బెండిలియయ్యె. ఏ నీవిధి నందరానిపండ్ల కఱ్ఱుసాచు చున్నాఁడ. ఇఁక నా కాకన్యారత్నము లభించుననుట ఎక్కడిమాట. కార్తాంతికుండగు విప్రుండు ధనలోభంబున నాకుం బ్రియవచనంబులు సెప్పి యావిశిఖినియందు నన్నుల యింతం జేసెడినో! దానియందుం గలయుత్కంఠాతిరేకంబునంజేసి యా బాపనయ్య సెప్పినవచనంబుల నమ్మి యాచిమ్మచీఁకటులం ,బడి కడు నలయుచుఁ గరగళితం బయిన

రతనంబు నన్వేషించుచాడ్పున వీథులవెంట వెదకుచున్నాఁడను. ఆకన్యాకారత్నం బెయ్యెడ దొరకునాయని మదికి నెవ్వెఱయుఁ బొడమక యున్నది. విధి యనుకూలం బగునేని యభిమతార్థంబు నన్యద్వీపమునుండియైనను గొనితెచ్చి కాకతాళీయంబుగలిం జేర్పకపోదు. ఇట్టులేకదా! తొలుత నీ రాజపుత్రితో విద్యావివాదంబు సేయం గోరి యీయూరికిం జనుదెంచి పురబాహ్యోపవనంబున విడిసియుండి మదనసేనాసందర్శనంబున నిచ్చ వొడమి యున్నవాఁడ నగుటంజేసి యుత్కంఠితం బయినచిత్తంబునకు నించుక వినోదంబు గల్పించుకొన నొంటరినై యీ యారామసీమం జెలువారుచారుతర తరునికరంబుల నిరీక్షించుచు నందుఁ గడుదవ్వులకుం జనిననాకు చెలికత్తెలతో నయ్యెడకు యదృచ్ఛాసమాగత యయినయారామణీయకనిధిదర్శనంబు నయనంబులకలిమికి ఫలంబుగ సమకూరినయది. ఇమ్మహోత్సవంబు లభించినవిధంబున మఱియు నిట్టివి జన్మఫలంబులు సంప్రాప్యంబులు గలుగంబోలును. ప్రాయికంబుగ బ్రాహ్మణులపల్కులు కల్లలు గావు. ఎందఱో రాజకుమారు లీరాజపుత్రికం గోరి వచ్చినవారలు దానితో వివాదంబున నోటువడి యవమానంబున కోర్చి తమపురంబులకుం జనిరి. ఎవ్విధినైన నీమదనసేనం దోడ్కొనిగాని మదీయపురంబుత్రోవం బట్టం జన దని యీవిడుపనిపట్టుదల నాకుం గలుగుటయుఁ దదనుగుణముగ నీనక్షత్రశాస్త్రవేది సెప్పుటయుంజూడ నభిమతార్థసిద్ధి గావచ్చుననియుం దోఁచుచున్నది.

ససారథికంబగురథంబున నారూఢులై గౌతముఁడును మదనసేనయుం బ్రవేశించిరి.

గౌతముఁడు:—ఓ ప్రాణవల్లభా! ఏల నీ వీయరదంబున నొకవంక సంకుచితాంగివై నిలువంబడి యుండెదవు? వేడ్కమెయి నాయంకతలంబునం గూరుచుండుము.

చ. సరసిజపాణి నీ బిగువుఁజన్నుల న న్ననురాగపూరభా
సురగతిఁ జేర్చి పైకొనవె సుందరి నీనును మోవిపానకం
బరుదుగఁ గ్రోలకున్న నిఁక నంగము నిల్వదు మన్మథాగ్నిని
ర్భరతరకీలల న్దగిలి భస్మముగాఁగల దాదరింపుమా.

మదనసేన:—(శోకంబుతో)

గురువరా! ఈబుద్ధి మీ కుండంజనదు. ఏను మీకు సుతాసమానను. శిష్యను. మఱియు మీయింట దాస్యంబు సేయంగల కింకరిని. అట్టికార్యంబుల నియోగించి నన్నుం బావనతరపదవీపరిచ్యుతం గాకయుండునట్లు సేయుఁడు. ఇట్టి తుచ్ఛసుఖంబులు మీసాలపై తేనియ లని మీర లెఱుంగరా! దయయుంచి నన్ను విడిచిపుచ్చుఁడు.

వీర్యగుప్తుఁడు:—(చెవియొగ్గి విని)

ఆ! ఈనిశీథసమయంబున నెవ్వఁడో తనకుం గూర్పనిదాని నొకదాని నపహరించి, దానిం బలాత్కరించుచుం గూడం దలంచి తనయభిప్రాయంబు సెప్ప నాబాల సేయునది లేక శోకభారోద్వేలలీలావికలంబుగం బ్రతిషేధించుచున్నది. ఇది కన్యకాంతఃపురోపవనసీమం జెలువారు సంకటరథ్యయందు వీరలు మాటలాడెదరు. వీరలెవరో! అరయుదము.

(స్మృతి నభినయించి)

ఎవ్వరో యన నేల! గౌతముం డీరాకన్నియవిద్యాగురు వతండు మదనసేనయం దనురక్తుండని విందు. వీరలవచనసందర్భంబు గౌతమమదనసేన లని యెఱింగించుచున్నది. మదనసేనయె యయ్యోనేని నాతపంబు పండె. బాగుగ నాలకించి సేయంగల కార్యంబునకుం గడంగెదను.

(అని గౌతమాదుల కభిముఖుంబుగ నడుచుచున్నాఁడు.)

గౌతముఁడు:—ఓసుందరీతిలకమా! ఈమాట లెల్ల మానుము.

క. ఓమదనసేన వినుమా, రామామణి వీవు నాకరస్థ వయితి వో
భామిని బహుకాలముగా, నే మది తహతహ పడంగ నీ వెఱుగవొకో.

వీర్యగుప్తుఁడు:—(సంతసంబుతో)

ఏఁజింతించినయర్థంబు నిర్ధారితం బయ్యె. వీఁడు గౌతముఁడె! మదనసేన నపహరించుకొనిపోవుట నిక్కంబు. వీనిం బట్టి బాధించి ఈనారీరత్నంబుం గొందును.

(నిరూపించి చూచి)

ఇదె ఏతదధిష్ఠితం బగునరదంబు నాసమీపసమాగతం బయినయది. శబ్దం బుప్పతిల్లిన నిం దిరువురకుఁ గార్యహాని యగును. కానఁ గోలాహలంబు గలుగనీకయ తొలుత సారథిం దునిమి గౌతమునిం బట్టి బంధింపవలయు. గౌతముండును సారథియుఁ దమ లోకంబై యున్నారు. వీరల కెఱుకపడక రథం బెక్కిన నాయుద్దిష్టకార్యంబు సాధించుకొనుట సుకరము.

(అని నాట్యంబున రథంబెక్కి గదచే సారథి నడచుచున్నాఁడు.)

యువకుఁడు:—అయ్యయో చచ్చితినిగదా! ఏ భూమిపయిం బడుచున్నాఁడ.

(అని వగ్గంబులు వదలి, ప్రహారవేదన నభినయించుచుఁ గరచరణవిక్షేపములతో నిహతుఁడయ్యె.)

మదనసేన:—(సంతసంబుతో)

నా కేఁడుఁగొనిన దీనాలాపంబు లాలకించి యాపాంచాలీమావరక్షకుండు వీరల నిరసింప నేతెంచెనో.

(సకరుణముగ)

ఓదయావిధీ! ఈ బ్రహ్మబంధువును బ్రాణంబులు దీయకుము.

వీర్యగుప్తుఁడు:—(ఆశ్చర్యపడుచు)

ఓకనకాంగీ! నీ కింతవిప్రియంబు గావించినవాఁ డయ్యును వీనిం జంపవల దంటివి. నీదయారసంబునకు మెచ్చుకొంటిని. నీకొకవరం బీఁదలంచినాఁడ. ఇట్టిసుగుణ సంపత్తిగల నీయందు నీదుర్భగుం డిట్లు కట్టిఁడియై ప్రవర్తించెం గాన వీనిం బట్టి శిక్షించెదను.

(అని తప్పించి గౌతమునిసిగం బట్టి ధనుర్జ్యాగుణంబుచేఁ బెడతెక్కలు విఱిచికట్టి)

ఓగౌతమా! పూర్వము నే నీరాజకన్యకతో విద్యావివాదంబు సేయంగడంగి నప్పుడు నికృతిమెయి న న్నవమానించి నాకుం బాణిగృహీత గావలసినదీనిం దప్పించి తివిగదా! ఇప్పు డేమి సేయంగలవో చూచెద. ఇది వాగ్వివాదంబు గాదు. వీర్య సారవివాదంబు. నీ విందుం జేయఁగలపని యేమొ? ఇందు నిన్ను వధింపవలయు నన్నది భావ్యం బయ్యును బ్రాహ్మణుండ వని యీవనజాక్షి కనికరించి యట్లు గావింపకు మని ప్రార్థించియుండు కతంబున నాదారుణవ్యవసాయంబువలన నివృత్తుండ నైతి. ఇదె నిన్ను బంధించితి. ఇఁక నీకు విమోక్షణం బెప్పటికో!

(అని గుద్దులుఱుముచున్నాఁడు.)

గౌతముఁడు:—(ఆత్మగతమున)

కట్టా! ఏఁ జేసిననికృతికిం జేసేత ఫలం బబ్బినయది. అట్టి కాళికానుగ్రహ పాత్రుని కళత్రంబును దొంగిలితెచ్చుట యూరక పోవునే! వీనికి నే నేమియుఁ బ్రతివచనం బొసంగఁజాల.

(అని యూరకున్నాఁడు.)

వీర్యగుప్తుఁడు:—(మదనసేనం గాంచి)

ఉ. చంచలనేత్రి నీవికచసారసపత్రవిశాలలోలనే
త్రాంచలలీలఁ గాంచ మది నాస జనించినవాఁడ నుగ్మలీ
కుంచితనీలముగ్ధశుభ కుంతలసంతతిసుందరంబుగా
నంచితరీతిఁ గాంచు భవదాస్యసరోరుహ మెత్తి యాసతోన్.

మదనసేన:—(సాతంకంబుగ ఆత్మగతమున)

వీఁడు నన్ను రక్షింపం జనుదెంచె నని యనుకొన్నందుకుఁ ద్రోసివేయం గూడని శత్రు వయ్యె. గౌతముఁడు బ్రాహ్మణుఁడుగాన మదీయధనుర్విద్యాకుశలతాదిగుణంబులకు భయింపడుచునతిక్రమింపం జాలక యుండినవాఁడు. ఇతండు నాకు భయపడువాఁడు గాఁడు. ఏమిసేయుదు.

(ఆశ్వాసంబుతో)

నామనస్సున కొకసమాధానంబు గలదు ; వీఁ డుత్తమక్షత్రియుండు గాన నల్పబుద్ధియై కుత్సితంపుఁబనులకుం జొరఁడు. గంభీరుఁడై ప్రవర్తించు. ఎవ్విధినైన నితనివలనఁ దప్పించుకొనవచ్చు నని తోఁచెడిని. ఇప్పటికి సమయోచితముగ బొంకిరయిన నితఁడు నన్నుఁ దాఁకకుండం జేసికొనియెద. మానభంగంబు గాఁబోవుకాలంబున దానం దప్పించుకొనుటకు బొంకులాడుట దోషావహంబు గా దని ప్రామాణికవచనంబు గలదు. మఱియు నితఁడు నావచనంబులు వినకపోఁడు. ఎట్లనిన :

క. వనజాక్షులయం దాసలు, గనినట్టియుదారశీలఘను లగుమగ లా
వనజాక్షులవచనంబుల, కును జవదాఁటరు తదీయకుతుక ప్రియులై.

మఱియు,

క. రసభావజ్ఞులు మదిలో, నసదృశ మగుప్రీతి యున్న నంగనలమనః
ప్రసవంబులు సౌరభగతు, లొసఁగక తహతహలుగూర రుత్కంఠితులై.

(ప్రకాశముగ)

ఓవీర్యధుర్యా ! నన్నుం జౌర్యమున నపహరించి తోడ్కొనిచనుచున్న యీ విప్రుని శిక్షించితివి ఇఁక నేను నీధనమను గాని యితరునిసొత్తు గాను. నూతినీళ్లు వెల్లువఁ బోనుభయంబుం గూర నావశ్యకంబు లేదు సూవె. ఉత్తమవంశసంజాతు లగుభూనాథులు తారు సెప్పినమాట మరల్పరు. కాన నిప్పుడు నాయందు సంతసించి కోరిన వరం బొసంగెద నన్నవచనంబు యథార్థంబు గా నావేఁడినయర్థ బంగీకరింపుఁడు అది యొద్ది యంటిరేని. కడవులంబట్టి యే నొక్క వ్రతంబు సేయం బూనుకొనియున్న దానను. అది యొకవత్సరమునకు సమాప్తిం జెందు. అంతదనుక నాయందు మీర లువ్విళులూరం జనదు. ఇదినాకు మీరు కరుణించి యీఁదగువరంబు. ఇది యొసంగిన వ్రతసమాప్త్యనంతరము భవదభీష్టార్థంబు నెఱవేఱుచుకొనంబును.

వీర్యగుప్తుఁడు:—(సంతసంబుతో)

ఓ సుందరీవతంసమా! అట్లయగుంగాత. రాజకన్యకం దోడ్తెచ్చినాఁడ ననుయశంబ నాకుఁ జాలును.

క. ఇంటికిని లక్ష్మియై నా, కంటికి దా నమృతవర్తికయుఁ బోలెను పె
న్నింట ముదంబునఁ దేలఁ గఁ, గంటికి ఫల మనుచు, నిన్నుఁ గనుఁగొనుచుందున్.

ఓసుందరీ ! ఏను మదీయం బగుకరూశదేశమునకు రథము దోలుచున్నాఁడను.

(అని యరదముఁ దోలుకొనుచు నిష్క్రాంతుండయ్యె.)

కాళిదాసచరిత ప్రకరణంబునందు పంచమాంకము సంపూర్ణము.

---

శ్రీరస్తు

# కాళిదాసచరిత ప్రకరణము

## షష్ఠాంకము

---

(గుణమాలినియు ధనమాలినియు సంభ్రమంబుతోఁ బ్రవేశించిరి.)

గుణమాలిని:—ప్రియసఖి ధనమాలిని! ఏమే యీవింత! మనభర్తృదారిక యగు మదనసేనగృహంబున నిశీథసమయంబునందు వైతాళికులు నిద్రమేల్కొలుపు నట్లున్నది. గాఢనిద్రాభియోగపాత్రమతులై యించుక మేల్కాంచి యావైతాళికులు తెలి యెఱుంగక యిట్లు గావించిరి గాఁబోలు? పూర్వదినంబునం బరిణయకార్యవ్యాపృతులై యుండుటంజేసి యిట్లు జరిగియుండవచ్చును. ఎట్లయినను మనము వైళంబ రాజపుత్రి కడకుం జనవలసినవారము గాదే! భర్తృదారిక యస్మదాగమనంబునకుం బ్రతీక్షించుచుండు. మనకును గతయామినియందు నిదురలేమింజేసి వేకువ యయ్యు నిశీథ మని తోఁచుచున్నదిరో! ఎందుకుఁగాని వైళంబ చనవలయు.

(అని ద్రుతతరంబుగఁ జనుచున్నారు.)

ధనమాలిని:—(శ్రమం బభినయించుచు)

ప్రియసఖి! గుణమాలినీ! మన మింతపరువెత్తిన నుద్యానమునందలి భర్తృదారిక యుండు కేళీగృహపుమార్గంబు ముగియకున్నది. మనము భర్తృదారికను బాసి యింటికిం జనుట కార్యం బుచితంబు గాదు. ఇప్పుడ యింటం దలవాల్చితిమి. అప్పుడ లేచి పరుగెత్తవలసివచ్చె.

గుణమాలిని:—ప్రియసఖి! యిట్లు వచ్చునని యెవ్వతెకుఁ దెలియునే!

(ముందుకు దృష్టులు నిగుడించి, భయంపడుచు నిలిచి)

ఓసీ! అదె కనుంగొనుము. యమభటుండు బోలె నతిభయంకరాకారుం డెవ్వఁడో మరణవేదనకుం బాల్పడి యూర్పులు విడుచుచుఁ గాలుసేతుల నిలకుం దాఁచుచుం బొరలుచున్నాఁడు. సమీపమునకుం జన భయం బగుచున్నది. ఈసంకటరథ్యయందుఁ బోయినంగాని వైళంబ భర్తృదారికకేళీగృహంబునకుం జేరలేము. ఏమిసేయనగును!

ధనమాలిని:—ప్రియసఖి ! భయంపడినం దీఱునా ! భర్తృదారిక మనరాక కెంత తహతహపడుచుండునో ! ఏమైననుఁ గానిమ్ము. పోదము రమ్ము ! భర్తృదారికకేళీగృహంబుం బాసిపోవుటం జేసి మన మపరాద్ధల మయి యున్నారము. అయ్యెడ నేదేని యొక యప్రియంబు జరిగిన మనకు మాట రాదటే !

గుణమాలిని:—ఓసి ! నీ వేమిచెప్పినను నామనంబునకు ధైర్యంబు గల్గలేదు.

(అని మెల్లన నడుగులిడుచు ముందు కొడలువంచి నిరూపించి చూచి)

ఓసి ! వీఁడు మనభర్తృదారికయం దుత్కంఠితుండై యుండు గౌతమునిసహచరుండు గిరిసారుం డనుయవనవీరుండు. రథ్యాప్రదీపశిఖాప్రకాశంబువలన బాగుగఁ దెలియంబడియెడిని. వీనిం గాంచి యీనగరంబునం గలకాంచనాంగు లెల్ల భయంపడుచుండిరి. వీఁడు సచ్చుట సంతోషావహం బయ్యె వీఁ డియ్యెడఁ గఠోరప్రహారంబున నిలకుం ద్రెళ్లియుండుటంబట్టి గౌతముఁడు నిష్కృతిమెయి భర్తృదారిక కహితంబుఁ గావించి మధ్యమార్గంబునఁ దననేస్తకానిం గోలుపోయి సంకటపడి యున్నవాఁ డను నర్థంబు దోఁచుచున్నది. దీన మనభర్తృదారిక కేదియో యిడుమ సంప్రాప్తం బయ్యె ననుట నిర్ధారితం బయ్యె. వైళంబ పోయి ప్రియసఖిం జూతము రమ్ము.

(అని త్వరితతరంబుగఁ బరిక్రమించుచున్నారు.)

గుణమాలిని:—(పురోభాగంబునకు దృష్టులు వఱపి, నెవ్వెఱపడుచు, త్వరతో)

ఓసి చూడవే ! మనతలంచునర్థంబు వివృతంబు లగునుద్యానద్వారకవాటంబులచేత నిర్ధారితం బగుచున్నది.

ధనమాలిని:—ఓసి యంతియ గాదు. కేళీమందిరరక్షకభటు లెవ్వరును గనంబడరు. దానికవాటంబులును దెఱవంబడియున్నవి. మఱియు నీమందిరంబు విజనం బయిన విధంబునం దోఁచెడిని. ఏమే ! యీకష్టము !

(ఉరంబున మోఁదుకొనుచు)

గుణమాలిని:—ప్రియసఖి ! నీనుడువుపల్కులు వినినంతన నాయంగంబులు విశ్లథంబు లయినయట్లు కార్యాక్షమంబులై ప్రసరింపకున్నవి. ఏమి సేయంగలనే !

ధనమాలిని:—ఎట్లున్నను బోయి చూడవలయుఁగదా ! ఇంటం బ్రవేశించిచూతము రా ! (ఇరువురును మందిరాభ్యంతరంబుం బ్రవేశించుచున్నారు.)

గుణమాలిని:—(కలయనవలోకించి)

అయ్యయో ! మనభర్తృదారిక గనంబడదే ! కట్టా ! మదనసేనకు; సర్వవిద్యావిశారదకు; శారదాదేవీసమానకు; సకలైశ్వర్యసంపన్నురాలికి; మనప్రియసఖి కిట్టిగతియా పట్టెను ?

(ఆకాశము లక్ష్యముచేసి)

ఓ ప్రియసఖి భర్తృదారికా ! ఓప్రియసఖీ మదనసేనా ! ఓప్రియసఖీ యభినవ మానవలోకశారదా ! ఆ ! ఎంతపిలిచినను బలుకవేమె ?

(సశోకముగ)

ఓసీ ! నే నిం కేమి సేయంగలనే ! హాప్రియసఖి ! ని న్నేకతినుండు గాఱియం పెట్టెనో ! ఏక్రూరకర్మునిచేతం జిక్కుకొంటివో ! అక్కటా ! నీ వేగతి వట్టితివో! ఆహా నీ వేయిదుమలు వడియెదవో ! ఎవ్విధంబునం బెగ్గలెదవో ! ఏరీతి నోర్చుకొందువో! ఎవ్వరికెవ్వరిం జీరెదవో ! ఏమని విలపించెదవో ! ప్రియసఖి ! నీవెట్టిక్రూరదశావిశేషం బనుభవించెదవో ! ప్రియసఖి! భర్తృదారికా ! ఏము నీకుం గష్టము సంప్రాప్తమగుకాల మునకు నిర్ఘృణల మై యెడబాసిపోతిమిగదే ! ఓముగుదా ! మమ్ముఁ బ్రియసఖులని నమ్మి యుంటివే ! ఏము కఠినాత్మల మై యిట్టిసమయంబున లేకపోతిమిగదే ! నీతండ్రి నిన్నొకదినమునసైనఁ జూడక యుండలేఁడే ! ఎల్లియుదయంబున నెవ్వరిమొగంబుం గాం చం బోను. దేవి మమ్ముంగాంచి మదనసేనసుఖం బడిగినేని యేమని నుడువంగలవారమే ! ప్రియసఖి ! ప్రియసఖి జగం బంతయు శీర్ణారణ్యం బయ్యెనే ! ప్రియసఖీ ! నిన్నిట్టు లచింతితోపనత మయిన యిడుమకుం బాలుచేసి యీగుణమాలిని భూమియం దిఁక జీవింపవలయునా ! ఓదైవమా ! కుటిల ! కాతపస్వినికి మూఢునిం బతిఁగాఁ జేసిన కొలంత యట్లుండ నిప్పుడు మొదటికే మోసము దెచ్చితివి. హా ! యీకాళరాత్రి నాకు వేగంబోదుసుమా ! వేఁగినదిపో ! నే నెవ్వరిమొగం బెట్లు గాంతు. ఓగుణమాలినీ ! నీకు భర్తృదారిక ప్రాణనిర్విశేష యని యందురే ! కామాట కల్ల యయ్యెఁగదా ! నీవు వాసి పోయినను బ్రాణంబులు పోకున్నయవి.

ప్రియసఖి ! మదనసేనా !

హా ! యింకేలనే గుణమాలిని బ్రతుకవలె !హా !నీనాయకునిగతి యెట్లయ్యెనోగదే!

(అని మూర్ఛపోయి యిలపయింబడియె.)

(భటుండు ప్రవేశించి)

ఓసి ధనమాలిని ! మనభర్తృదారిక యగుమదనసేనదయితుండైన కళాచంద్రుండు తన ప్రాణదయితకుం జెప్పు మని నా కాజ్ఞాపించి పంపినయర్థంబు విని యది రాజపుత్రి కకుం దెల్పుము.

ఉ. ముద్దులగుమ్మ నిన్నుఁ గడు మోహముచే నెడబాయలేక నేఁ
దద్దయుఁ గుందుచున్నదిక దక్షిణ వచ్చితిఁ దీర్ఘమాడ నీ
ప్రొద్దును దీర్ఘమై యెసఁగె పాత్రిరొ వెండియు వత్తు నన్న నో
కొద్దిగ రేయి యుండు నని కోమలి నిల్చితిఁ దాన మాఁడఁగన్.

క. మానిని నే లే ననుచున్
మానసమున ముదముఁ దక్కి మనికితము పడం
బూనుకొనఁ బోకుమీ యను
మానింపకు వేగ వచ్చి మన్నింతుఁ జెలీ. అని.

ధనమాలిని:—సఖి ! సఖి ! యూరటం జెందుము. మనమదనసేనకు భర్త యయిన వాఁడు కళాచంద్రుఁడఁట. అతఁడు నదీస్నానార్థంబు సని ప్రొద్దు గల దని యయ్యోడన తడసి యందుకుం దన ప్రాణదయిత యుత్తలంపడకుండఁ బ్రణయసందేశంబుం బంపి యున్నవాఁడు. దీనివలనం గళాచంద్రుండు మూఢవేషమున వచ్చి తనరూపంబు బయల్పఱిచి వైతాళికులవచనంబుల మోసపోయి తన ప్రాణవల్లభ యింట నున్న దని యాసందేశ మంపినయర్థంబు సుస్పష్టంబయ్యె. అట్టికళాచంద్రునిం బలిఁ గాఁ బడసి యాసుకుమారాకారునితో సౌఖ్యంబుఁ గూరుటకు లేక యీరాజపుత్రిక యెంత దీనదశం జెందిన యది. కట్టా ! యీతపస్విని కెట్టిచెట్ట యుట్టిపడెనే !

గుణమాలిని:—(ఆశ్వాసంబుఁ గల్పించుకొని)

సఖీ ! మనప్రియసఖికిం గళాచంద్రుండు బలియయ్యె నన్నది విన్నని త్తఱిదరిలేని దుఃఖసాగరంబున మానసంబు మునుంగుచున్నె ! ఆకళాచంద్రుండు కడుసమర్థుం డని యుఁ గరూశభూశాధీశునిమంత్రికుమారుం డనియు విందును. మనము వైళంబ చని మదనసేన యిట్టిదం గానంబడనివృత్తాంతంబు నతనికి నివేదింతము.

(అని ధనమాలినితో లేచి, భటునిం జూచి)

ఆర్య ! కళాచంద్రుం డుండుచోటికి మమ్ముం గ్రక్కునఁ దోడ్కొని పొమ్ము. రాజకన్యకావృత్తాంతం బతని కెఱింగింపవలయు.

భటుఁడు:—ఓసి గుణమాలినీ ధనమాలినులార ! రండుపోద మతని కడకు!

(అని వారలం దోడ్కొని నిష్క్రాంతుండయ్యె.)

## ప్ర వే శ క ము

(కళాచంద్రుండు ప్రవేశించి, శోకంబుతో)

ఉ. మానవతీమణిం దలఁచి మానస మొక్కటఁ దుఃఖసాగరా
నూనవినూత్నపూరమున నోలి మునుంగుచునున్న దక్కటా
యూనలినాయతాక్షి కుటిలాలకలాలితమందహాసల
క్ష్మీనవకాంత మా మొగము మేలిమితో నికఁ జూడఁ గల్గునే !

ఇది యిఁక నీమందభాగ్యుని కందరానిదియ యని తలంచెదను. నియతముగ నియతి యీకళాచంద్రుని గష్టములు పెట్టం బూనుకొనియున్నాఁడు.

ఉ. కోరుచునుంటి నేఁ దొలుతఁ గోమలగాత్రను బెండ్లియాడఁగం
గూరిచి నామనోరథము గూఢముగా విధి యిప్పు డేడ్తెఱన్
ఘోరవియోగతాపభర గుంఫిత వేదన పాలుచేసె న
న్నీరహిఁ జేయ నీనియతి కేమి యొనర్చితినో విరోధముల్.

హా ! దైవంబు తనకుంగలకష్టదాననైపుణ్యంబు నాయందుం గాన్పించినవాఁడు.

ఉ. ఆనవమోహనాంగిఁ గనినంతన గౌఁగిటఁ జేర్ప లేకనే
మానసిమూఢభావమున మ్రాన్పడియుంటి నొకింతకాల మా
మానిని నాకు మూఢదశ మానిచి యేల్కొనఁ బూనునంతలో
చానను నన్నుఁ బాపె విధి సహ్యమె యేరికి నైన నీవ్యథల్.

ఇఁక నీకళాచంద్రుని కీలోకయాత్ర యెవ్విధిఁ జరుగఁ బోవునో !

ఉ. కంటికి నిద్ర రాదు నృపకన్యకఁ బాసిననాటినుండి నా
యింటికిఁ బోవఁ గా హృదయ మెల్లవిధంబుల సమ్మతింపదు
కంటకితత్వముం గనుచుఁ గాయము దాపముఁ దాళలేదు న
న్నొంటరిఁ జేసెనే విధి పయోరుహలోచనఁ బాపి వ్రేల్మిడిన్.

ఇంక నీకళాచంద్రుండు భూతలంబునకు భారభూతుండు గాని మానితజీవుండు గాఁడు.

ఉ. పాపపునాథవం బిపుడు ప్రాప్తఫలంబును గోలుపోయె నం
తాపపరీతమై తనువు దగ్ధతఁ గాంచుచు నున్న దింతియున్
కేడుములాడ లెవ్వియును జిత్తమున న్స్ఫురియింప వే మొహో

(ఆశ్వాసంబుఁజేసికొని)

శ్రీపతిసద్దయామహిమచేత శుభంబులె కల్గు నన్నియున్.

మదనసేనప్రియసఖులు గుణమాలినియు ధనమాలినియు నాకడకుం జనుదెంచి రాజకన్యక గానంబడ దని నాకుం దెలిపిన దాదిగ.

క. పాతాళగుహను బడిన, ట్లాతతగాఢాంధతమస మలమినరీతిన్
భూతోపహతము మాడ్కిన్, చేతోగతి స్రుక్కెఁ గరము చింతాకులమై.

ఏనును సేయంగలకార్యంబు దోఁచక మదనసేన జననీజనకులం జూడ నొల్లక నా తలిదండ్రులకడకుం బోనిచ్చగింపక యచ్చపలాక్షీమణిని దలంచుచు ననేకదేశంబులు దిరిగి ధారానగరంబుఁ జేరితిని. ఈనగరాధిపతి భోజుండు కవికులంబున కవ్వారిగ ధనంబు లొసంగుచున్నవాఁడు. ఇతనిసభాస్థలంబునకుం జేరితినేని సర్వకాలము కవివరులతో విద్యావినోదంబునం గాలయాపనము సేయుచుండవచ్చు. అట్లయినం బ్రియావిరహవిక్లబం బగుమానసంబునకు వ్యాపారాంతరప్రవణతాబలంబునం గొంత యాప్యాయత గల్గుంబోలు.

(ఎదుటికి దృష్టులు నిగుడించి ఆశ్చర్యపడుచు)

ఔరా! ఈయెదుటం బొడసూపు బాలికావతంసంబు పురహరనయనాగ్ని దగ్ధుండగుమన్మథునికిం గల్పించినసంజీవనౌషధివిశేషనవాంకురంబునాఁ దోఁచెంచుచున్నయది. ఔరా యీకుందరదనయందం బేమందును?

చ. నును పవడంపు దీవియనుంగునిగారపుఁగావిమోవి
కుందనపుఁబొంకాటపుంగొమరు తళుక్కులకాఱు మెఱుంగమేను శో
భనవనీలనీరజనిభం బగువాల్గనుదోయి యొప్పు నీ
యనుపమరూప బాలిక భవాంబుధి కిందిర నాఁగఁ బోల్చెడిన్.

ఈనితంబవతీకులాభరణంబుం గాంచినంతన నిది నాకన్నుల కమృతవర్తికయుం బోలె నతులానందంబు సమకూరుచున్నది.

మఱియును,

ఉ. చానను బాసి దుఃఖభరసాగరమందు మునుంగుచుండు నా
మానస మీసుమాస్త్రసమానజయేందిర బాలికామణిన్
జానుపడంగ నాత్మకును సంతరణం బనియెంచి మించి యీ
మానవతీలలామకును మక్కువఁ జొక్కుచునున్న దెంతయున్.

ఈకాంచనాంగి తనయీడు బాలికామణులం గూడి తాళపత్త్రాదిలేఖనోపకరణహస్తయై చనుచుండుటం గాంచిన నీపంచాననమధ్య విద్యాభ్యాసంబు సెలుప విద్యాశాల కరుగుట సువ్యక్తం బయ్యెడిని. ఈచక్కెరబొమ్మ యిట్లేగుదెంచుటయు మించిన రాగవిశేషంబుం బురికొల్పుచున్నయది.

క. ఈలలన తాళపత్త్రముఁ, గేలం ధరియించి రాఁగఁ గేదఁగిబాకుం
లీలఁ దనమగని దనుచుం దాలిచి చనుదెంచురతివిధానం దోఁచెన్.

(స్మృతినభినయించి)

కొన్నిదినంబులకు ముందు సాయంసమయకర్తవ్యం బగుభువనేశ్వరీచరణనళిననమస్కారణంబునకుం జనుచున్నానయనపథంబునం దగిలినబాలారత్నం బిదియ కాఁబోలు! అప్పు డేను కార్యాంతరాసక్తుండనై యతిత్వరితగతి నరుగుచున్నవాఁడ నగుటంజేసియు నాకనకాంగి బాల్యక్రీడాపరాయణయై యుండుటంజేసియు బాగుగ నిరూపింప నయితి గాకయుండెడె. ఈలలనామణియు నాకు సమ్ముఖముగ నేతెంచుచున్నయది. బాల్యంబున నుండుటంజేసి యంతగ లజ్జాగతి యెఱుంగనిది గాన నసంకుచితమనస్క యయి నావచనంబులకుం బ్రతివచనంబులొసంగును. కులకుమారికాజనోచితంబు గానిరథ్యాపర్యటనంబు సేయుకతంబున నిది వేశ్యాకన్యకయై యుండం బోలు, దీనితో సంలపించి దీనిసరసవచనామృతంబుం గ్రోలి విరహదవదహనాయత్తంబైయు త్తలంపడుచిత్తంబున కొకించుక తనివిఁ గల్పించుకొనియెదంగాక.

(అని యుపసర్పించుచున్నాఁడు.)

(వేశ్యాకన్యకయు సఖులును బ్రవేశించిరి.)

సఖులు:—ప్రియసఖి యిదె చూడు! మొకసర్వావయవసుందరుండు మూర్తిం దాల్చినమన్మథుండునాఁ బొలుచువాఁడు కరం బనురాగంబులో నిన్నుం గాంచుచు నీరామణీయకమున కెద మెచ్చుకొనుచు మందహాససుందరం బయినవదనారవిందంబులో నీచెంగటి కేగుదెంచుచున్నవాఁడు. ఇతని యతిరమణీయాకృతిం జూడుము. మనకుం గరము గౌరవ్యుండు. కాన మన మొకింతతడవు నిలువంబడి యామహాభాగుని వచనంబులు విని సబహుమానంబుగ వీడ్కొని పోవుదము. ఇతండు కొన్నిదినంబులకు ముందు నీబాలక్రీడావిశేషంబుం గాంచి కర మరుదుగ వర్ణించియుండు సరసకవితావిశేషవిభూషితుండు. ఇట్టి మహనీయులయనుగ్రహంబునకుం బాత్త్రంబ వయితివేని శ్రేయంబులెల్ల నమకూరు.

(వేశ్యాకన్యక కాళిదాసునిం గాంచి విస్మయంపడుచు నిలుచుండె.)

కాళిదాసుఁడు:—కాంచనమాలకు డగ్గఱి)

1. శ్లో. కా త్వం బాలే.

వేశ్యాకన్య:—వినయంబులో

2. శ్లో. కాంచనమాలా !

కాళిదాసుఁడు:—(ఆత్మగతమున)

ఔర ! ఇది దీనికిం దగిన పేరు. దీని నిరవద్యం బగుసౌందర్యంబునకు శోభావహంబుగ విద్యయు నుండుట బంగారమున కామోదం బుండుటయు.

(ప్రకాశముగ)

3. శ్లో. కస్యాః పుత్రీ !

కాంచనమాల:—(ప్రణయంబులో)

4. శ్లో. కంచుకవత్యాః.

కాళిదాసుఁడు —(ఆత్మగతమున)

కంచుకవతి భోజభూపతిరాణి యగులీలాదేవికిం బ్రధానసైరంధ్రిపదంబున నుండునది యనియు నసమానరూపగుణగణోపేత యనియు వినియున్నాఁడ. దీని వినయవివేకాదులు దానియాత్మజాత యనుటకుం దార్కాణ యయియున్నది.

(ప్రకాశముగ)

5. శ్లో. కిం తే హస్తే.

కాంచనమాల:—(ముఖవికాసంబులో)

6. శ్లో. తాళీపత్రం.

కాళిదాసుఁడు:—(ఆత్మగతమున)

ఔర ! దీని ప్రత్యుక్తిమాధుర్యంబు కర మభినందనీయంబై యొప్పుచున్నది.

(ప్రకాశముగ)

---

1. టీ. బాలే = ఓపడుచా ! త్వం = నీవు, కా=ఎవ్వతెవు ?

2. టీ. కాంచనమాలా = కాంచనమాల యనుదానను.

3. టీ. కస్యాః = ఎవ్వతెకు, పుత్రీ=కూఁతురవు.

4. టీ. కంచుకవత్యాః = కంచుకవతియనుదానికూఁతురను.

5. టీ. తే = నీయొక్క, హస్తే = చేతియందుండునది, కిం=ఏమి ?

5. టీ. తాళీపత్రం = నాచేత నుండునది తాటాకు,

* శ్లో. కా వా రే ఖా.

కాంచనమాల:—(మందహాసంబుతో)

† శ్లో. కా ఖా గా ఘా.

కాళిదాసుడు:—(శ్లాఘించుచు)

ఔర! అతివిస్మయనీయం బగునీబాలభావంబె యిట్లు విలోభనీయంబై యుండ దీని యభినవతారుణ్యవిలాసం బింతకంటె నెంతో మనోహరంబై యుండదా!

ఉ. బంగరుతీవెయందు నవపల్లవ ముద్భవమౌట చిత్రమా
సంగతరోచి యై యదియ సారసుధారస మొల్క టబ్బురం
బుం గలిగింపకున్నె యికఁ బుష్పసముద్గమకాల మయ్యెనే
నిం గలుగంగఁ బోవుఫలనిర్వృతి యెట్టిదొ తోఁచ దాత్మకున్.

(అని కాంచనమాలం గాంచి నవ్వుచు)

ఓకులుకులాడి! యిప్పు డీవు.

చ. కులుకుంగు త్తపుగుబ్బచన్నుఁగవతోఁ గ్రొమ్మించు మైఁదీఁగెతో
నలఘుశ్రోణిభరాలసం బగుకరంబుందంపుయానంబుతో
లలితోదారవిలాసలాలసకళాలాలిత్యవైచిత్రితో
విలసన్నూత్నవయోవిలాస వగుచున్ వేడ్కల్ దగం జేయుమీ!

కాంచనమాల:—(స్మితముఁ గావించుచు, ఆత్మగతమున)

---

* టీ. రేఖా = గీత, కావా = ఏమి? ఈ గీత యేమి యనిప్రశ్న.

† టీ. కాఖాగాఘా = కాఖాంగాఘాలు.

ఈకాంచనమాల నవనీలనీరజాభంబు లగువాలుఁగన్నులును ఎఱుపుమీఱులే మోవియుఁగలది యని కవి వర్ణించుటవలనను ఇది సుందరుం డగుపురుషునిం గాంచి విస్మయంపడుటవలనను ఇట్టిగుణము లావిర్భవించుతారుణ్యప్రాదుర్భావ పూర్వకాలికం బయినపదినంవత్సరములప్రాయము గలది యని నిర్ణయింపవలసియున్నది. అప్పటికి కాఖాగాఘాలు పఠించుచుండుట వయస్సునకుం దగినదిగా దనవచ్చు. మఱియుం గవి యడిగిన శ్లోకసమస్యలకు శ్లోకరూపముగా నుత్తర మొసంగుటం జేసి విద్యాకవిత్వవిచక్షణ యనియుం దెలియుచున్నది. కాన నిచట కాఖాగాఘా అని విశేషాకారముతోఁ బల్క నందుకు నక్షరసామాన్యతాప్రతీతియే భావ్యము సామాన్యమును విశేషముచేతఁ బల్కుట యర్థ్యోయెడల విదిత మగుచున్నది. భక్తమందారుఁడు అనుచోట వృత్తవిశేషమును జెప్పుటకు సామాన్యముగుకల్పవృక్ష మన తాత్పర్యము గదా!

ఈసుందరాకారునిపలుకులవలన మానసంబు లజ్జాకులితం బగుచున్నది.

ఈతనియెదుట నుండ నోప. చెలికత్తెలమఱుగున కరిగెదను.

(అని సఖులమాటునకుఁ జనుట నభినయించుచు నిష్క్రాంతయయ్యె.)

సఖులు:—(ఒండొరులతో)

ఏమే యీచిత్రము? ఈకవిచంద్రుండు మనసఖి కభినవయౌవనాగమంబు గలిగిన నెట్లుండునోయని యావిశేషంబుం గనుంగొనం దలంచుచుఁ దదనురూపంబు లగువచనంబులు వల్కినవి ముగిసినతోడన మనప్రియసఖి సమారూఢయౌవన యగుచు రతీదేవివిధంబునం బొలుపారుచున్నయది. ఇట్టిమాహాత్మ్యంబు గలవాఁడు కళాచంద్రుండ యని విందుము. ఆతండె యయ్యె నేని మనకాంచనమాలభాగ్యంబు పండినయదియ.

(నేపథ్యంబువలనికిం జూచి)

ఓసి! ప్రియసఖి! కాంచనమాలా! ఏలనే యిట్లు సిగ్గుపడియెదవు? ఎప్పటికైన నిట్లు గావలసినదానవేగదా! అమ్మహాతిశయం బిప్పుడ సమకూరి యిమ్మహాపురుషాభినందనీయం బగుటకు మహామోదంబు నందుచు నిట్టిమేలు సమకూర్చినయీమహాకవికిం గృతజ్ఞతాసంసూచనం బొనర్పక మామాటునకుం జనుట పాఁడియే. అట్లు పోవం జనదు. ఇతని వీడ్కొనియైనఁ జనపలయుఁ గాదే! కవికడకు రమ్ము.

(అని చేతులు వట్టి తిగుచుచున్నారు.)

(అభినవయౌవనముతో లజ్జావనతాననయై కాంచనమాల ప్రవేశించి)

ఓసి సఖులార యేమతిశయంబుం గాంచిమీరలిట్లు నన్నగడు పెట్టం గడంగితిరి?

సఖులు:—ఓసి ప్రియసఖి! నీమైఁదీఁగె నేమతిశయంబు వొడసూపినది యెఱుంగవా?

కాంచనమాల:—(తన్నుం గలయం గాంచుకొని, ఆత్మగతమున)

ఉ. చిత్ర మిదేమి నాశ్రవణసీమలకుం జనె నేత్రపద్మముల్
గాత్రము వీడసాగెడిని కాంతునిపై మదిఁగోర్కిగ్లె నే
మాత్రము గానరాదు గదె మధ్యము నూఁగుగ నారు దోఁచెడిన్
మాత్రన భార మయ్యెఁ గటిమండలి సిగ్గును నిగ్గదేరెడిన్.

ఇట్టి యభినవతారుణ్యకళావిశేషంబు వొడముటకు ఫలంబుగ,

చ. సుభగవయోవిలాసుఁ డతిశోభనగాత్రుఁ డుదారకాంతి యా
యభినవమన్మథుండు నను నాదర మారఁగఁ జెట్టపట్టి నా

యభిమతసిద్ధిఁ గూరిచి సుఖాంబుధివీచికలందుఁ దేల్చునే
శుభగతి నాథవంబును విశుద్ధతఁ జెంది కృతార్థతం దగన్.

సఖులు —ఒండొరులతో)

ఓసి! యీకవికులకుంజరుండె కొన్నిదినములకు ముందు మనసఖి దాగిలిమూఁత లాడం గడంగి యందు కనుపడకపోవుటంజేసె ఖేదంబుంగొను నాసొంపుం వర్ణించి చెవుల పండుపు సల్పినవాఁడు. ఈరసికవరునకు గాంచనమాల ననురాగనిబంధనంబుం గావింపంజనును.

(కళాచంద్రుని గాంచి)

ఓసరసకులావతంసమా! నీవు కొన్నిదినంబులకుముందుఁ గార్యాంతరవ్యాపృతుండవు వోలెఁ ద్వరితగతి వేశ్యవాటికం జనుచుంటివి. అప్పుడు మాప్రియవయస్య తన యీడుబాలికామణులు దాఁగిలిమూఁత లాడుచుండుటకు సంతసంపడుచుఁ దాను నాయాటలాడం గోర్కి వొడిమి వారలం దరిసిన నద్దానిం దమతోఁ జేర్చుకొనక తమ తెగనుండి వెలువఱిచినం గాంచనమాలయుఁ గడు ఖిన్నయై యేడుచుచుం దనతల్లికిం జెప్పఁగా నది యందుకుం గతంబు విచారించి తనూజాత యాత్మీయాసదృశాభిరూప్య ద్యోతకంబులగువచనంబులు కొన్ని ముగుదతనంబునంజేసి వానిభావంబెఱుంగక పల్కిన నందు కలరుచు న గ్లేడుచుచున్నదానిం బలుమాఱు ముద్దుగొనుచు నవ్వుచుండఁగా నందుకు మఱికొందఱు సవయస్య లబ్బురంపడుచు నయ్యేడకుం దత్కాలసమాగతుండవగునిన్నుంగాంచి నీరూపగాంభీర్యాదుల కలరుచు నీతో మాటలాడం గోరి ప్రియవయస్యవృత్తంబు నెపంబు గావించుకొని నీకుందరిసి నిన్నుం జీరి యోయయ్యా! యీ యబ్బురంబుం గాంచితివా! ఈబాలిక యేడువనేడువ దీనితల్లి నవ్వుచు ముద్దిడుకొనుచున్నది. ఇదియేమి? యని యడిగిరి. అందు కీ విట్లంటివి.

* శ్లో. న మాతుం శక్యం మే నయనయుగమాళీకరతలైః,
తనుజ్యోత్స్నా సేయం విఘటయతి గాఢాంధతమసం.

సవయస్యలు తామాడుదాఁగిలిమూఁతలాటలకు రానీనికారణంబున ఖిన్నురాలైన బాలిక తనతల్లితో వారలు తన్ను వారియాటలలోఁ జేర్చుకొనమికిం గారణములు వచించుచు నేడుచుచున్నది.

టీ. * పుత్రివచనము. హేజనని = ఓతల్లీ! మే = నాయొక్క, నయనయుగం = కన్నుదోయి, ఆళీకరతలైః = చెలికత్తెలహస్తతలములచేత, మాతుం = మూ

**సఖీనామాహూతిం విరచయతి సౌరభ్యమితి తాం,**
**రుదంతీం తన్మాతా హసితవదనా చుంబతి ముహుః.**

---

మితియొనర్చుటకు, నశక్యం = సాధ్యముగాదు. ఓయమ్మా ! నాకన్నులు చెలికత్తె యలచేరలకొలకకు మీఱియుండుటచేతఁ గన్నులు మూయించుకొనువారి తెగలోఁ జేర్చుకొన రని యనుచున్నది. కొందఱు దాఁచుకొనునప్పుడు వారిని వెదకి పట్టవలసిన వారిని మఱికొందఱు కన్నులు మూయుచు డాఁగవలసినవారు డాఁగినవెంటనే కన్నులు తెఱచివిడుచుటయుఁ గరతలముల చేతనే కన్నులు మూయవలయునన్నదియు లౌకికక్రీడావిశేషపరాయణసమయసిద్ధము. కన్నులుపూర్ణముగ మూయనిచో డాఁగి కొనువారు కనఁబడుదురు. మూసియుం బ్రయోజనముండదు. దీనికన్నులు చేరల కెక్కుడవయి యున్నవి కానఁ గన్నులు మూయునది తా మూయనను చున్నది. సేయంతను జ్యోత్స్నా = శరీరచ్ఛాయాచంద్రిక, గాఢాంధతమసం = దట్టమగు నంధకార మును, విఘటయతి = చెదరఁగొట్టుచున్నది. ఇతరులకుం దెలియఁబడకుండ నంధ కారావృత మగుస్థలంబున డాఁగెనేని వెన్నెలనంటిశరీరకాంతి యాచోటియంధకారం బును రూపుమాపి యందఱకు నన్నుం దెలియునట్లు సేయుచున్నది. కాన డాఁగికొను వారు వైళంబ పట్టుపడు దానిని జేర్పంజన దని తమ తెగకపమానము రాకుండం గాఁచి కొనుటకుం గడంగి తన్నుం జేర్చుకొనుటకు సమ్మతింపరు. అని యనుచున్నది. కడు దవ్వులకుం జని డాఁగికొనవచ్చునే యన్నచో:—సౌరభ్యం = దేహమునంగల పరి మళము, సఖీనాం = చెలికత్తెలకు, ఆహూతిం = పిలుపును, విరచయతి = చేయుచున్నది. పద్మినియగుకాంతకు దేహమందు దివ్యపరిమళ ముండునుగాన నీబాలికయు నాజాతిలోఁ జేరినదియగుటంజేసి యట్టిసౌరభము శరీరమం దున్నది. ఇది పోయినమార్గమున సౌరభము గ్రమ్ముకొనుకారణముచేత దానిని నిరూపించి సఖు లక్రమమునం బట్టు కొందురు. ఎంతదవ్వుల కఱిగినను మార్గమున మూఁగినసౌరభము కాంచనమాల యీ వైపునకుం జనియె, రండు పట్టుకొనుండు అని తెలుపుచున్నది. కానను డాఁగికొను వారలును తమతెగలోఁ జేర్చుకొనరు అని జననితోఁ జెప్పుచున్నది. ఇతి = అని, రుదంతీంతాం = ఏడుచుచుండునద్దానిని, తన్మాతా = దానితల్లి, హసితవదనా = నవ్వుదేఱు మోముగలదై, ముహుః = సారెకు, చుంబతి = ముద్దిడుకొనుచున్నది. తాను స్త్రీరత్న మగుటంజేసి తనకన్నులు చేరల కెక్కుడవయి యుంట కడు సౌందర్యవతి యనుటకుం దార్కాణ యని యెఱుంగక ముగుద యగుటంజేసి యిది యాటలాడుటకు లేక పోయెనే యని ఖేదపడుచున్నదే యేమి దీని మౌగ్ధ్యమని తల్లి దానిని దానియొక్కతె పల్కునకు ముద్దిడుకొనుచున్నది. ఇట్లే లెక్కనరెండు నూహించునది.

అని వచించి యుద్దిష్టకార్యంబు సాధింపం బోలివి. అది విని యాకాంచనమాల తల్లి కడు సంతసించుచు నిట్టిరసికకులావతంసంబునను రాగంబు వడసినం గదా యీ కాంచనమాలరూపరేఖాదులు సార్థంబు లగును. ఇతనియుక్తిమాధుర్యంబు కరం బరుదై తోఁచుచున్నయది. ఇంతదనుక నీయతివిలాభసీయాకృతికిం దగినవాఁడు రసికవతంసుం డుపలబ్ధుం డగునా! యని చింతం గూరుచుండునాకు మానసంబునం గలిగియుండు నాకులభావం బిప్పుడు నివర్తించినయది. ఇట్టిసరసాగ్రేసరులు తమకు రూపౌదార్యాది గుణంబులఁ దద్దయు నుద్దియగుముద్దుగుమ్మలయందు ననురాగపూరితాంతరంగులు గాక పోరు ఉాడనిమ్మీ చింత దీని కభినవయావనంబు సంప్రాప్తం బయినయనంతరము గదా సలుపవలయు. అందు కింకను రెండు మూఁడు వత్సరంబులు గడవవలసియున్నవి. ఆకాలమునకుం జూచుకొందము. అని యిట్లు సెప్పుకొనుచుం దనతూఁతు నూరడించె. ఓకవికులావతంసమా భవదనుగ్రహంబున నాయతిశయము సయిత మిప్పుడ సమకూరిన యది. దానికి ఫలంబుగ మా ప్రియసఖయుం దనురాగంబుం గైకొని కంచుకవతిప్రార్థనం బంగీకరించి తదీయమందిరంబును భవదీయ పాదకమలరజఃపరిపూతంబు గావింపుము.

కాళిదాసుఁడు:—ఓకాంతాతిలకంబులార! మీపలుకులవలనకరంబు సంతసం బందితిని. ఆనాఁడు భువనేశ్వరీపాదవందనాభిరక్తి వైళంబ చనుచున్నవాఁడం గాన బాగుగ నిరూపింప ననువుపడకపోయె. ఆబాలికావతంసంబె యిది యని నిర్ధారణ సేయంజాలక సంశయాక్రాంతమానసుండనై యుంటిని. రూపరేఖావిలాసంబులం బర స్పరసమానభావంబునం బరగుబాలికామణు లెందఱో యుందురుగదా! ఆబాలికావతంసంబె యిది యగుటవలన నాకుం బరమానోదంబు సమకూరె. దీనితల్లి కంచుకవతి దీని ముద్దుగొనుచున్ననాతియే నా! దానివినయాదిగుణంబులకుం గడుసంతసించినాఁడ.

(నేపథ్యంబునం గలకలంబు గల్గఁగా)

(కాంచనమాలసఖులు తిరిగిచూచి, భయసంభ్రమంబులతో)

ఓసి ప్రియసఖ కాంచనమాలా! అదె కనుంగొనుము; భోజభూపాలుని స్యాలకుండు కమలాదేవీసహోదరుఁడు తురగారూఢుండై సమీపమున నుండు పురజనంబులం బ్రహరించుచు మనయుండుకడ కేతెంచుచున్నవాఁడు. ఇతఁడు కరము కఠోరుఁడు. రాజవల్లభుండు నగుటం జేసి తాఁ జేసినపనులకుం బదులునేత యుండ దని గర్వంబుం గొనియుండువాఁడు. మఱియుం గామవశీకృతుండై సుందరీసందోహంబునం దక్రమం బాచరించుచున్నాఁ డని వింటిమి. వీఁడు మనకాంచనమాలం గాంచి నేని సంచలితస్వాంతుండై యవినయంబునకుం గడంగక పోఁడు. ఏమి సేయం జనును అక్కటా! యీదుస్తరంపు దుఃఖసముద్రంబునుండి ప్రియసఖ నెట్లు తప్పింపం జనును. ఏమి సేయుదము!

తురగాధిరూఢుండై రాజస్యాలకుండు ప్రవేశించుచున్నాఁడు.

రాజస్యాలకుఁడు:—(ఆత్మగతమున)

హోరా! ఏమి యాచిత్రము! ఒకనిమిషకాలమునకు ముం దీవేశ్యాకన్యక గాకెదురయ్యె! అప్పుడు బాల్యంబు వీడకయుండినయాయంగజయాన యిట్టు లొక్క కుడుగునన యభినవయౌవనోద్భేదసుభగ యగుట కరమచ్చెరంబై యున్నది. అరయ నియౌవనాగమ మత్యద్భుతంబు. ఈపుండరీకాక్షికి శైశవంబునన యుండినదానికి చూచుచుండునప్పుడ

చ. ఉరమున నుబ్బుమీఱెఁ గుచయుగ్మము కన్నుల దీర్ఘభావముల్
సరగున నెచ్చెఁ గన్బొమలు సారెకు వక్రము లయ్యె నంతకుల్
గరము వచోవిలాసములు గన్పడె వక్రము లేచు మధ్యముల్
బరమతనుత్వముం గొనియె భారము లయ్యె నితంబబింబముల్.

ఆదియునుంగాక యీరమణీశిరోమణికి యౌవనవిశేషోద్భేదంబువలన నంగకంబులం గలిగిన గుణవినిమయంబు కరము శ్లాఘనీయం బైనయది బాల్యంబువీడుచుండ నేక పదంబునన తారుణ్యంబు గూడుచుండునప్పుడు.

ఉ. తనుభావంబు కటీతటంబు దొరఁగం దాఁ బైకొనె స్తనం బలో
చనముల్ పాదవిముక్తచంచలగతుల్ శ్లాఘించు చంగీకరిం
చెను వక్షంబు నురోజకుట్మలయుగశ్రీరమ్యతం బూనె యౌ
వన మీకాంతశుభాంగకంబులగుణవ్రాతంబు వే మార్పఁగన్.

ఇది లీలాదేవిసైరంధ్రి యగుకంచుకవతికూఁతురు కాంచనమాల. దీని బహు దినంబులుగ రాజకులంబునం దనవారితో మెలఁగుచుండుదానిం గాంచుచు దీని రామణీయకంబున కరుదందుచు దీనినవయౌవనాగమసంప్రాప్తిఁ గోరుచుంటిని. మదీయ భాగ్యబలంబునన కాఁబోలు! నిది యిట్టిరమణీయావస్థం గాంచినయది. బహుకాలం బునకు నామనోరథంబు నీడేరె. దీని నాయింటికిం దోడ్కొనిపోయెద ఈనగరం బున నాసేయంగఁదగిన పనుల కడ్డముపల్కుట కెవ్వనికైన నం దరం బగునే! ఏ నశ్వంబుం దిగి దీని నశ్వారూఢం గావించుకొని తోడ్కొని చనియెద. ఇట్లయిన నితరులు నన్నుం దటాయింపం జనుదెంచిరేని నాప్రియురాలు వారికి హస్తగత గాకయుండు నట్లు గాచుకొన నగును. ఇది సామాన్యకన్య యగుటంజేసి యిట్లు సేయుట యంతగా నపరాధంబుగఁ బరిణమింపదు. వైళమ మనోరథంబు నెఱవేర్చుకొనెదను.

(తురగంబుడిగ్గి కాంచనమాలనెత్తి యశ్వంబుపైఁ గూరుచుండంబెట్టెను.)

సఖులు:—(హాహాకారంబులు సేయుచు దేచాటుచేసికొని.)

ఓసి! మనముద్దుచిల్క బావురుబిల్లివాతం బడియెనే! యిఁక నేమిసేయం గలవారము. ఈక్రూరకర్మునివలన విడిపింపనివాఁడీముద్దుగుమ్మ యొడలు విడుచు. ఇందు జాప్యసేయం జనదు. ఎగ్గు వాటిల్లు. కాన వైళంబ చని మనయేలికసాని లీలాదేవి కీయద్భుతంబు విన్నవించితిమేని యాదేవి కుతూహలపడి కాంచనమాలను గాంచం దనకడకు రప్పించుకొనును. అట్లయిన నీ క్రూరునినిరోధంబు మనకశక్యం బౌనుం. ఒం డుపాయం బిందుకయోగింపదు. ఇందు మనలోఁ గొందఱు సని విన్నవింతు రురుకు.

(అనుకొనుచు సఖులలో గొందఱు నిష్క్రాంతలైరి.)

కాంచనమాల:—(విన్నయైన మోముతో, కంపంబును భయంబును పెనంగొన, వాఁడి మిగులుచూపులఁ గాళిదాసునిం జూచి)

ఉ. రాతిరి వోవ్రు రేపకడ రాఁగల ధైర్యముఁ డుద్భవించుఁబో
నూతనకాంతి తమ్మిసిరి నూల్కొనినవ్వును నూవె యంచు నీ
భూతిని పంకజోదరనిబద్ధము షట్పది యూసఁ గాంచి సం
భూతమదంబు హాస్తి యొకపూనికి నబ్జిని సంహరించెడిన్.

కాళిదాసుండు:—(ఆత్మగతమున)

ఈయింతి తానుడివినపద్యంబువలనఁ దాను దన కిష్టుండైన ప్రియునిసమాగమం బునకుం గుతూహలపడుచుండఁగా దన యిష్టార్థంబునకు విరోధంబుగ నీకష్టుని చేతం బడవలసివచ్చె నయ్యయో యేమిసేతు ననుభావంబు నాకు సూచితము గావించినయది. ఈదుర్వృత్తునిమదం బడంచి యీనాతి నీసంకటమువలన విముక్తం జేయ నగును.

(ప్రకాశముగ)

ఓరాజస్యాలక!

* శ్లో. చతురం తురగం పరివర్తయతః పథి పౌరజనా న్పరిమర్దయతః,
నహి తే భుజవీర్యభవో విభవో భగినీభగభాగ్యభవో విభవః.

* టీ. పథి = మార్గమునందు, పౌరజనాన్ = అడ్డముగావచ్చినపురజనులను, పరిమర్దయతః = ప్రహరించుచు, తురగం = గుఱ్ఱమును, చతురం = చాతుర్యముతో, పరివర్తయతః = ఆస్కందితము, ధౌరితకము, వల్గితము మొదలగునశ్వధారావిశేషంబులతో నడిపించుచు, తే = ఇట్లు ప్రవర్తించుచుండునీకు, విభవః = ఇట్టివైభవము, భుజవీర్యభవః-విభవః = బాహువీర్యముచేత సంపాదించిన విభవము, నహి = కాదు. మఱి:— భగినీ భగభాగ్యభవః = నీతోడఁబుట్టినదానిభగముచేసినభాగ్యమువలననైన, విభవః = వైభవము. నీ విట్లు మార్గమున కడ్డమువచ్చినవారిం బ్రహరించుచు గుఱ్ఱపుస్వారిసేయు వైభవము నీకు నీబాహువీర్యమువలన నైనది గాదు. మఱి నీతోడంబుట్టినదానియం దనురక్తుండై యుండుభోజునియందుం గలదాక్షిణ్యావిశేషము. అనిభావము.

రాజస్యాలకుఁడు:—(సెవ్వెఱపోయి, కాళిదాసునిం గాంచుచు. ఆత్మగతమున)

కట్టా! వీఁడు నన్ను నిపుణంబుగ నుపాలంభించినవాఁడు. వీఁడు నన్నధిక్షేపించుట విని రథ్యాజనులు స్మేరముఖు లయి నన్నుం గాంచుచు నేగుచున్నారు. ఇంతకంటె నవమానం బేమి గలదు. వీనికి మాఱొడ్డితినేని యింతకంటె మిక్కుటముగఁ బరిభవంబు గల్గుట నిక్కంబు. కాన వీనితో మాటలాడం జనదు. మఱియు నీతఁ డీయూర నుండునేని నావంటిగర్వితులగర్వం బడంచుచుండు. వీని నేవిధినైనం దుద ముట్టించుట యుత్తమంబు. అట్లయినం గాని నాగడంగినకార్యంబు నిరభ్యంతరంబుగఁ జరగదు. ఏవిధి వీనింజంపింతును.

(చింత నభినయించుచు సోల్లాసముగ)

ఆ! చింతితార్థంబు నెఱవేఱుచుకొనుటకుఁ ద్రోవ దొరికినయది. ఇట్లగునేని వీఁడు బ్రహ్మరక్షోహతుండై చచ్చు. ఇదియ కర్తవ్యంబు.

హస్తసంజ్ఞచే భటునిం బిలిచెను.

(భటుండు ప్రవేశించి)

ఆర్య! యే మాజ్ఞ యిడెదరు ?

రాజస్యాలకుఁడు:—(భటునికర్ణంబునం గొన్నియర్థంబులు వచించి)

ఓరి! వైళంబ యని కార్యం బనుకూలింపం జేయుము.

భటుఁడు:—అయ్యా! మీయానతిం జరిపెదను. ముదలఁ గొనుచున్నాఁడను.

(అని నిష్క్రాంతుం డయ్యె.)

స్యాలకుఁడు:—ఎదుటికి దృష్టులు నిగుడ్చి.

(ఇదె లీలావతీపరిచారికలు గొందఱు త్వరితగతిం జనుదెంచుచున్నారు. ఏలకో! చింతం గూరుచుండెదను)

(లీలావతీపరిచారికలు ప్రవేశించి, ఒండొరులతో)

ఓసి యిదేనటే మనకంచుకవతికూఁతురు కాంచనమాల!

ఏమే యీచిత్రము! ఈనాఁటియుదయంబున మనము చూచినప్పుడు బాల్యంబున నుండినయది. ఇప్పు డిట్టితారుణ్యంబు నొందుటకరము చిత్రంబు గాదె! దీనిం గాంచుచుండినప్పుడెల్ల కమలాలయాదేవీసహోదరుం డీతండు శృంగారరసపరత్వంబుం బొందుచుండువాఁడు. వీఁడు దీనియౌవనాగమమునకుం బ్రతీక్షించుచుండినయర్థంబు రాజకులంబునం గలపరిచారికాజనంబునకెల్ల సువిదితంబు. ఇదియుఁ దగుసమయంబున నితనిచేతికిం దొరికె. లీలావతీసందేశంబుం జెప్పితిమేని యీబాలిని విడువం జాలక యుత్తలంపడు. ఎట్లైనను జెప్పక తప్పునే!

(సమీపమునకుం జేరి)

ఆర్య దేవి యగులీలావతి తన ప్రధానస్వైరంధ్రిక కూఁతునకుం గాంచనమాలకు నసమయంబున వింతగ నభినవయౌవనంబు గలిగె నని విని యాకనకాంగిం గాంచం దలంచి దానిం దోడ్కొని రమ్మని మ మ్మిందఱ నంపియున్నది. దేవీనియోగం బనుష్ఠింపం జనును.

స్యాలకుఁడు:—(చింతతో ఆత్మగతమున)

కట్టా! చేయలంతిం దొరికినబంగారము చేయిజాఱిపోవున ట్లున్నది. ఏమి సేయనగును. దేవియానతి దురతిక్రమణీయము తదీయపరిచారికాజనంబునకుం దదాజ్ఞాప్రతిపాలనంబు నప్రతిషేధ్య మగు.

(అని చింతించుచూరకుండె.)

కాంచనమాల:—(ఆత్మగతమున)

ఇదియ వీనిచేతినుండి తప్పించుకొనుటకుం దగుసమయము.

(గుల్మమునుండి దిగ్గనుఱికి లీలావతీపరిచారికాజనంబులోఁ గలిసికొనియె.)

(నియోగిజనులు కొందఱు ప్రవేశించిరి.)

నియోగులు:—ఈరాజస్యాలకుండు మనకుం జెప్పినంపినరహస్యంబు చెఱుప మన మియ్యెడ కేగుదెంచియున్నారము గాదా! వీఁ డీపాపం బెవ్వనియందు జేయం దలంచినవాఁడో?

(కాళిదాసునిం గాంచి)

ఎవ్వనియందని విచారింపనేల! ఈమనోహరాంగునియంద యని నిర్ణయింపం జను. వీఁడు రూపవంతులం జూచి యోర్వంజాలనివాఁడు. ఈతేజోవంతునెదుట గాఢాంధతమసంబు సూర్యునెదుటంబోలె రాజస్యాల కృతం బగునికృతి యడంగక పోవునా! అయిన నతఁడు సేయుకపటంబు కడు దుస్తరంబు. ఎట్లయ్యెడినో! మనకుం జేసినయాజ్ఞ యనుష్ఠింపక తీరదు గదా!

(కాళిదాసునిం దరిసి)

కవివరా! వందనము! ఈధారానగరంబున భోజభూపాలుండు తననగరంబున నుండువారిం గడుసమర్థులశిల్పివరులం గొని సకలజననయనమనోహారంబుగ నొకభవనంబు వినోదార్థంబుగ నిర్మించి దానం గ్రొత్తగ నీయూరికిం జనుదెంచినవారలం గని పిలిచికొనిపోయి యాతిథ్యంబుసేయ మమ్ము నియోగించియున్నాఁడు. మేమును ప్రతిసంధ్యము సంచరించుచు సాధువులం గనిపెట్టి తోడ్కొనిచని వారలకు విందొనర్పుచుందుము. నీవు కవికులవర్యుండవు. నిన్నుం బూజించితిమేని యాధారాపతి యొనరించినపని సార్థకం బగును. మాప్రార్థనం బంగీకరించి మావెనువెంట రమ్ము.

(కాంచనమాలయు సఖియలును ఆత్మగతంబున)

కట్టా ! ఈ నియోగిజనులు రాజస్యాలకునిదుర్ణయంబునకు లోనై యీమనోహరాంగుని బ్రహ్మరాక్షసునికి భక్ష్యంబు గావింపం గడంగియుండెదరు. వీరలు సెప్పిన భవనంబు ప్రాంతరస్థ్యయం దున్నది. అది నిర్మించిన దాదిగ ననేకులు పాంథులేమఱుపాటున నాయింటం బరుండి దానిం గాచియుండు బ్రహ్మరాక్షసునిచేత భక్షింపంబడి మడిసి రని యిది యీయూర నెల్లరకుం దెల్లంబయినయది. భూతాధిష్ఠితం బైన యీమందిరంబునకుం గొనిచని యీకవిచంద్రునిం జంపంబోయెదరు. ఏమి సేయవచ్చు ? ఈమన్మథోపమునికిం గలిగినదుస్తరంపుటిడుమ నెట్లు తొలంగింపవచ్చు. కట్టా ! ఇట్టి యాపదకుం బాల్పఱిచి విధాత యీతనియం దకార్యంబు సేయం గడంగె. దైవమా నీకఠోరచరితంబు నేమనంజాలుదును. నీసేయంగడంగినపనులకుం బ్రతివిధానంబు లేక యున్నది. ఓయనాథరక్షకా ! శ్రీయఃపతీ ! నీవ యీకవిం గావంగలవాఁడవు.

కాళిదాసుఁడు:—ఓయధికృతులార ! మీప్రార్థితార్థం బనుష్ఠింప నే సిద్ధపడి యున్నవాఁడ. పోదము రండు. ఆభవనం బనల్పశిల్పనైపుణసీమం బని విందు. దానిం జూడఁ గోరిక నాకును గలదు.

కాంచనమాల:—(ఆత్మగతమున)

ఆ ! ఏమిసేయుదు ? ఈకవివరుండు నియోగిజనులప్రార్థనకు సమ్మతించిన వాఁడు. ఈజగన్మంగళరూపనిర్మాణునిమొగంబుం గాంచనినాఁడు నే నీయొడలు దొరంగుట నిక్కంబు. ఈతని కేదేని యిడుమ దొడరిన నాప్రాణంబు లుండవు. ఈ యభినవమోహనాకారునితో నయ్యేడకుం బోఁజన దని వచింతు నన్ననో ఈరాజస్యాలకునికిం గోపంబు గల్గు నని తోఁచుచున్నది. ఇందుఁ జేయంగలకార్యం బిది యని నాడెందంబునకుం దోఁపదు. ఈసుకుమారాకారునిం గూడనినాఁడు నాకాయంబు దురంతవేదనానికాయంబై యడంగుట నిక్కంబు.

లీలావతీపరిచారికలు:—ఓసీ ! కాంచనమాల ! దేవి నిన్నుం గాంచఁ ద్వరపడి యెడిని. పోదము రమ్ము.

(అని దానిం దోడ్కొని చనిరి.)

కాళిదాసుండు:—(ఆత్మగతమున)

కాంచనమాల దైవవశమున నీయవినీతునిచేతినుండి విముక్తయయ్యె. లీలావతీదేవికడకుం దోడ్కొనిపోఁబడియెడిని. కాని దదాజ్ఞానుసారిణి యై కంచుకవతి యాత్మతనూజాతయభీష్టార్థంబు నెఱవేర్పకపోదు. క్రమక్రమముగ నిది నాకు లభించు. ఇప్పుడు ప్రియావిరహవిక్లబం బయినమానసంబున నీకాంచనమాలం గాంచి యించుక యాశ్వాసంబుం జెంద నగు నని తలంచుకొనుచుండ విధి యనాకాంతసాంగినియుత

నొందఁబఱుచున్నది. ఇప్పుడు ప్రతికూలప్రవర్తనంబున నుండువిధి యనుకూలప్రవర్తనంబునకుం గడంగక పోదు. ఈనియోగిజనులు పిలుచుభవనంబునకుం జని యందు జరుగు కార్యంబులచేఁ గొంతప్రొద్దుపుచ్చెదను.

కాంచనమాలసఖియలు:—ఓసి మనప్రియసఖి! ఈకవివల్లభునియం దనురాగంబుం బొందినయదియ. ఇతని కేదేని యప్రియంబు గల్గిన జీవితమును సయితము పరిత్యజింపం గడంగు. ఇప్పు డీకవివరునికిం గలిగినయడరున నితనికి రహస్యార్థంబు విన్నవించినచోఁ దప్పించుకొనంగలఁడు. లేనిచో బ్రహ్మరాక్షసునివాతం బడును. మనలో నెవ్వతె యైనం గవిననుసరించుకొని యాభవనంబుదనుకం జని యయ్యెడ వేచియుండి తటి దొరకిన నితని కీకపటంబు విన్నవింపవలయుం. ఇందు కీమధురవచనయ సరి.

రాజస్యాలకుఁడు:— (ఆత్మగతమున)

పోనిమ్మా కాంచనమాల; రాజకులంబుననయుండునది; నాకుం దొరకక పోవునే! ఇప్పుడు నా సేయంబూనినకపటంబునం గవిని పిలుకుమార్చి మానసంబునకు సుస్వస్థతం గలిగించుకొనియెద. తదుచితసావిధానంబు జరుపంబోయెద.

(అని నిష్క్రాంతుండయ్యె.)

కాళిదాసుఁడు:—

చ. ప్రియను దలంచి మానసము పెక్కుతెఱంగులఁ గుందసాగె నా
నియతికి నాత్మలో నిపుడు నెమ్మి యొకించుకయేని గల్గ దా
శ్రయ మొకటైన లేక మది సంతతదుఃఖము వాయకున్న దిం
తయును వనజాయతాక్షునికృతం బడలం బనిలేదు దీనికిన్.

క. వనజాక్షునిదయ గల్గిన, ఘనతరదుఃఖాంబునిధిని గాల్వయుఁ బోలెన్,
జనులు దరింతురు నా కతఁ,డనఘుఁడు శరణంబు గాక యన్యుఁడు గలఁడే.

ఇప్పుడు రాజనియోగిజనంబులతోఁ జని చిత్రసీమం బను పేరం బరగుభవనోత్తమంబుం గనుంగొనుచు రాత్రి పుచ్చెదను.

(అని నియోగిజనంబులతో నిష్క్రాంతుండయ్యె.)

కాంచనమాలసఖులు:—ఓమధురవచన కవివెంట నరుగుంగాక. మనమందఱము గృహంబులకుం బోవుదము.

(అని యందఱు నిష్క్రాంతలైరి.)

**కాళిదాసచరిత్రప్రకరణంబునందు షష్ఠాంకము సంపూర్ణము.**

శ్రీ ర స్తు

# కాళిదాసచరిత్రప్రకరణము

## సప్తమాంకము

---

(భోజభూపతియు లీలాదేవియుం బ్రవేశించుచున్నారు.)

భోజుఁడు:—దేవీ! నీ విప్పుడు వింతయైన లేనగవుతోఁ గనుపట్టుచున్నావు. దీనిం గాంచ నీముఖసారసంబువలన నేఁ గ్రోలం దగుశ్రవణామృతం బొందు గల దని తోఁచుచున్నది. అట్టి దేదేని యుండిన వీనులకు విం దొనర్పుము.

లీలాదేవి:—(స్మితము గావించుచు)

ఆర్యపుత్ర! భవదీయం బగువదనారవిందంబు మందహాససుందరంబై యొప్పునది యిప్పు డీవత్సంశయాకులం బగుచుండుటం గాంచిన మీరు నన్నేదే నొకయర్థం బడుగం దలంచినట్లు సూచితం బగుచున్నది.

భోజుఁడు:—దేవీ! నీతర్కం బుపపన్నంబు. కొన్నిదినంబులనుండి యొకవింత కాంత నానయనపథంబునం దగులుచున్నది. అది మనసైరంధ్రి యగుకంచుకవలి కూఁతురు కాంచనమాల యని యూహింపం దగియున్నను దానికూఁతురు శైశవంబునన యుండునది గాన నాసంభావన యసంభావితంబై కనంబడుచున్నది. ఆకాంత యెవ్వతెయో యని సంశయించుచున్నవాఁడ.

లీలావతి:—(లేనగవుతో)

ఆర్యపుత్ర! ఆవింతకాంత యెవ్వతె యని మీ రనుకొంటిరి?

భోజుఁడు:—దేవి! అది కాంచనమాలయే యని నిర్ణయించుకొనియుండెదను. కాంచనమాల యయ్యేనేని యిప్పుడ తరుణియయి చూపట్టం గతంబు లేదు. కాన సంశయించెదను.

లీలావతి:—ఆర్యపుత్ర! మీరొనరించిననిశ్చయంబు యథార్థంబు.

భోజుఁడు:—(వైచిత్ర్యంబుతో)

దేవి! యేమి యిది! అది కాంచనమాలయేనా! అట్లైన దాని కభినవయౌవనాగమం బకాలంబున నెట్లయ్యె?

లీలావతి:—ఆర్యపుత్ర! ఒకమహాత్మునివలన నది లభించినయది.

భోజుఁడు:—(ఆశ్చర్యంబుతో)

దేవి ! ఇది కడు చిత్రమై యొప్పుచున్నది. అట్టిమహాత్ముం డగుకవివరుం డెవ్వండో ! అకాలంబునన యౌవనాగమము గలుగునట్లు వచించిన యామహాత్ముని వాక్సిద్ధి నేమందును ! కావృత్తంబును సాకల్యముగఁ దెల్పుము.

లీలావతి:—ఆర్యపుత్ర ! విన్నవింతు వినుండు.

(అని రాజు చెవిలోఁ జెప్పెను.)

భోజుఁడు:—దేవీ ! నీచెప్పినకవి కాళిదాసుండై యుండనోపు ! కాని నాఁడితని వచనంబుల నర్థంబును వర్తించుట యెక్కడిది ? అట్టి వాక్సిద్ధి యాతనికే గలదనియె తెలియుంగుదును.

ఇతనిం గాంచం గోరి బహుదినములుగ నేఁ బ్రయత్నించుచున్నవాఁడ. ఇట్లుండ నేను నామంత్రి యగునార్యబుద్ధిసాగరుండు నొకనాఁడు వేషాంతరధారులమై నగరపరీక్షార్థంబు పణ్యవీథిక నరుగుచు నం దొకమాంసాపణముదగ్గఱ సన్యాసి నిలువంబడి పలలము బేరమాడుచుండుటం గాంచి ఆ ! మననగరమందు నిట్టియధర్మము జరుగుచున్నదిగదా ! యని యచ్చెరువందుచు నతనివృత్తం బారయం గోరి యాతనిం జేరి చేని ట్లంటిని.

1శ్లో. భిక్షో మాంసనిషేవణం కిముచితం.

అని యడుగఁగా నతఁ డి ట్లనియె.

2శ్లో. కిం తేన మద్యం వినా.

అనఁగా నితం డింతటితో నుండువాఁడు గాఁడు; మద్యంబునను ప్రియంబు గలిగియున్నాఁడు. ఆ ! ఏమి వీని సన్యాసప్రకార మని యనుకొని యి ట్లంటిని.

3శ్లో. మద్యం చాపి తవ ప్రియం.

అనఁగా నతఁడు

4శ్లో. ప్రియమహో వారాంగనాభి స్సహ.

---

1. భిక్షో = ఓరిసన్యాసీ ! మాంసనిషేవణం = మాంసభోజనము, ఉచితంకిం = యుక్తమాయేమి ?

2. మద్యంవినా = మద్యములేక, తేన = ఆమాంసముచేత, కిం = ఏమియుపయోగము?

3. తవ = నీకు, మద్యంచాపి = మద్యమునయితము. ప్రియం = ప్రియమా ?

4. వారాంగనాభిస్సహ = వారాంగనలు త్రాగఁగా శేషించినది వారలతోఁ గలిసిత్రాగుట, ప్రియమహో = ప్రియము.

